శ్రీ రంగావధూతల వారి దివ్య

జీవితము




THE

# LIFE AND TEACHINGS

OF

# SADGURU SREE RANGAVADHUTA DEV.

BY

SREE JNANAMAMBA,

OF

BEZWADA.



SREE BHYRAVA PRESS.

MASULIPATAM.

1909.

ఓమ్.



మద్గురు దేవతాయైనమః

# శ్రీరంగావధూతలవారి

## దివ్య జీవితము, జ్ఞానబోధ.

(మోక్షదాయకము.)

ఇది

బెజవాడ పురనివాసిని యగు

శ్రీ జ్ఞానమాంబచే

రచియింపఁబడి

శ్రీ భైరవముద్రాక్షరశాలలో,

ముద్రింపించి ప్రకటింపఁబడియె.

మొదటి కూర్పు 1000 కాపీలు

మచిలీబందరు.

దీనివెల రు 0—4—0.

1909.

# పీఠిక.

పరమపావనక్షేత్రంబన విలసిల్లు శ్రీబృందావనపురంబున నవత రించిన నిర్మలవిజ్ఞాన విశారదులును వేదాంత నిధులును ప్రకృతిద్వాయ దోషరహితులునుయగు శ్రీరంగావధూతలవారి జీవితంబును, వారుఅప్పు డప్పుడు లోకోపకారార్థమై నిజసమాధి నిష్ఠను జాలించి, అజ్ఞానులై ప్రాపంచకవిషయకూపారంబున మగ్నులైయున్న జనులయెడం జాలిఁద లంచి యుపదేశించిన, బ్రహ్మజ్ఞాన బోధమునిందు పద్యరూపముగా, విజ్ఞానామృతగ్రంథకర్త్రియగు శ్రీజ్ఞానమాంబగారిచే విరచింపంబడి యె. సార్థకనామయగు నీసాధ్వీమణినిగురించి విజ్ఞానామృతగ్రంథపీఠికలో యించుకంత దెలియనగు. శ్రీరంగావధూతలవారు బ్రహ్మానందరసమగ్నులై కొంతపద్యరూపమునను, కొంతవాక్యరూపమునను, కొంతగీతికారూప మునను వుపదేశించిన వారి జ్ఞానబోధ శ్రోతలు వీనులవిందుగా వినుట కేగాని వ్రాసుకొన జాలినంత యవకాశమేమియు లేకుండెడి అనర్గళప్ర వాహ వాగ్ధోరణీ విరాజితంబయ్యుండె. అందుకొన్నియంశములుమా త్రమే గ్రంథకర్త్రికి శ్రీరంగావధూతలవారి ప్రియశిష్యులైన శ్రీసీతారా మావధూతలవారు బోధించిరి. వారిబోధయేయిట్లు పద్యరూపముగా వ్రాయనయ్యె. అందువలననే గ్రంథము అంతవిపులముగా నుండుటకు వీలులేదయ్యెను.

ఇంక కవితాప్రాశస్త్యమును గురించి చదువరులే విమర్శింపంద గినవారు. సాహిత్య, వ్యాకరణ, గ్రంథంబులం జదువక యే పరమేశ్వర కృపాపరిపాకముచే నెట్టులో, పద్యములల్లుటకు బడసిన యీ మెకవిత యందు దోషములుండినను యుండవచ్చును.

ఇట్టిదోషములు వ్యాకరణాదిగ్రంథములు చదువుకుని కవితకుం దొరకున్న విద్వత్కవీంద్రుల యందు కూడ ప్రమాదవశంబున నైనను కనుబడకపోవు. యేదియెట్లున్నను నేటికీ మాత్రము పద్యరూపకముగా మహానుభావులైన శ్రీరంగావధూతలవారు జనుల కుపదేశించిన జ్ఞాన బోధను వారిశిష్యుని శిష్యురాలు రచించి వారిశిష్యుల చిరకాల మనోరథమును యీడేర్చినందులకై యీమహనీయురాలికి మేముజేయు ప్రత్యుపకారము వందనములకంటె వేరొసంగజాలకున్నారము.

ఇట్లు,

అత్తూరి రామమోహనరాయ్,

శ్రీరంగావధూతభక్తజనసమాజముయొక్క సెక్ర

గుంటూరు.



ఓం.

# శ్రీ రంగావధూతలవారి

## దివ్య జీవితము.



శ్రీ గీర్వాణపటుప్రభావిమలచారిత్రావ్యయానంద! యో
రాగాసూయవినాశ! దివ్యమహిమన్ రాణించుచున్నట్టి యో
త్రైగుణ్యాదిహారీ! సుదేవ! పరమాత్మా! నిష్క్రియా! పావనా!
వేగంబే నను బ్రోవవే సుజనసంవేద్యా! మహాత్మా గురో.

మ॥ ధరలో సాగరతీరమందు శుచియై ధారాళమై యొప్పుచున్
పుర మొక్కండలరున్ విశేషసుఖసంపూర్ణంబుగాఁ బ్రౌఢమై
చిరగూఢిన్ మచిలీపురంబనఁగఁ దాఁ జెన్నారుచున్ దుగ్ధసా
గరకన్యామణి వాసయోగ్యముగ శ్రీకల్యాణ సంధాయియై. ౧

ఉ॥ వారిధియైన భర్గమున వాసిగ నప్పురరాజ మిమ్మహిన్
శ్రీ వెలుఁగొందఁగన్ మిగులఁ జెన్నుగఁ దాను మనోహరంబుగాఁ
బావనవిద్యచే వెలుఁగు పండితజాలము చేతనెంతయో
గోవను వెల్గుచుండు ఘనులు కోమల కీర్తి చెనున్న వాక్పతుల్.

చ॥ విమలులు దివ్యభక్తులు వివేకసుభూషణు లైనపావనుల్
కొమరుచెలంగఁ జేయుచును గుర్వుగ భాసిలుచుండ దివ్యమై
న మహిని వెల్గుచున్నసుజనంబులు ధార్మికులున్ మహాత్ములున్
సమధిక కీర్తిచే వెలయు సంస్కృతమై యలరారుచున్ మహిన్. ౪

శా॥ ఆపీఠం బ్రథితంబుఁ జెంది మహి నత్యంతంబు సత్కీర్తిచేఁ
శ్రావంబై విలసిల్లుచున్ గలదు గోత్రంబొండు ప్రకాశమై

శ్రీవామమ్మున వెల్గు చన్నిటను దాఁ శ్రేష్ఠంబుగా సంపదన్
దావారాశికిఁ దుల్యమై ధరణిలోఁ దాలారి నామంబునన్. ౫

శా॥ ఆవంశంబున నుద్భవించిన ఘనుండౌ సుబ్బయార్యుండు దా
లావణ్యాంబగు కీర్తిచేఁ గలఁ డిలన్ లాలిత్యమాపుణ్యుఁడై
శేవం బొల్చుచు నాసుధీరుసతి దా శీవిన్ బ్రకాశించెడిన్
యావిస్ఫారసుకీర్తివంతులకు దివ్యాత్ముండు ధాత్రీస్థలిన్. ౬

ఆ॥ వె॥ ఉద్భవంబునొందె నద్భుతచరితుండు
పరమపావనుండు భవ్యమూర్తి
భవభయహరుఁడైన వరగుణుఁ
తిమిరదీప విమలతేజుఁ డవని. ౭

క॥ పదునెన్మిదివందలయె, న్బదియువయబ్దంబున జయవారంబందున్
పదునొకటవ దినమందు, న్విదితంబైయలరురోహిణీధిష్ణ్యమునన్.

ఆ॥ వె॥ అంను జూన్నెలందు నవతరించెనవని
విమల సచ్చరితుఁడు తమమనియెడు
నంధకారమడప నర్కుండు ధరలోన
దివ్యమూర్తి జగదతీతుఁ డరయ. ౯

క॥ రంగయను నామంబున,
శృంగారం బలర వెలసె క్షేమకరుండున్
సంగవిమోచనుఁ డమలుఁడు
మంగళదాయకుఁడు జ్ఞానమణియిమ్మహిలో. ౧౦

ఆ॥ వె॥ జనన మాదిగాను దినదినవర్ధనుం
డగుచునుండ ధరణి నాచిఱుతకుఁ
దనువులోనె వేడ్క జనకంబుగా భక్తి
వృద్ధిఁజెందుచుండె విరివిగాను. ౧౧

ఉ॥ సత్య మహింస ధర్మమును శాంతియు దాంతియు నేమలేమియున్
ముత్యమువంటి దివ్యమతి ముఖ్యగచేష్టల శూన్యచిత్తుఁడున్
అత్యధికంపుభక్తియును నవ్యయమౌ సుగుణ ప్రవర్తనల్
నిత్యముగాఁ బ్రసిద్ధిగనె నిర్మల బాల్యము నందె వీరికిన్. ౧౨

క॥ పూవు వికసించు తోడనె, తావియు ప్రసరించు నావిధంబుగనే యీ
పావనుని జన్మతోడనె, భావుకమగు నట్టిజ్ఞానభక్తులు గలిగెన్. ౧౩

క॥ ఎనిమిది యేడులప్రాయము
ననునుండఁగ నతనివారు నయముగ ధరణిన్
మనమలరఁ జదువుకొఱకై
పనిగొనిబడికిన్సుహితుని పంపఁగనతఁడున్. ౧౪

ఆ॥ వె॥ చదువఁ బంపినమొదలధికశ్రద్ధగలిగి
పాఠశాలకేగి ప్రతిదినమున
భవ్యబుద్ధి గల్గి బాగుమీఱంగను
విద్య నేర్చుచుండె విమలుఁ డిలను. ౧౫

వ॥ ఇట్లుండ. ౧౬

చ॥ చదువఁగ నేగి యీఘనుఁడు సాయమునందున నింటికేగి తా
నధికసుభక్తిచే భగవదర్చనఁ జేయుచు తోడి బాలురన్
ముదముగఁ దోడి తెచ్చి మది పుష్కలమైనటువంటి శ్రద్ధతో
పదునగు భక్తిచే భజన బాగుగ నెమ్మినిఁ జేయుచుండెడిన్. ౧౭

వ॥ మఱియు. ౧౮

చ॥ బహువిధమైన భక్తి నిలపావనుఁ డామహితుండు కొన్నివి
గ్రహములను నుంచి యచ్చటను రమ్యముగల్గ నలంకరించుచున్
మహము మనంబునం దలల మూర్తి నెనంగుచుఁ బొంగి పొర్లఁగా
ను హరువు నుద్భవించఁగను నూర్లొను భక్తినిఁ జేయుఁబూజలన్.

మ॥ యెసగై వెల్గెడు భక్తిచే దిన దినం బీరీతి సావాసులౌ
పసివాండ్రన్ జతఁజేసికొంచు భజనల్ బాగొప్పఁగావించు శ్రీ
పొసగంగా నలరారుచున్ మహితుఁడౌ పుణ్యాత్ముఁడా ధీవరుం
డసమానంబగు చర్యలన్ బొనరుచుం వ్యాపించువిఖ్యాతుఁడై. ౨౦

ఉ॥ వారొకవేళ రామనిన వారక వారల యిండ్ల కెన్నియో
సారులు పోయి రండనుచు సంస్థవ మొప్పగ బాలకుండు నా
పేరిమి తోడ యర్భకుల పిల్చుకవచ్చి యొనర్చుపూజలన్
వారము వారమున్ విడక వాసిగ మిక్కిలి భక్తి శ్రద్ధలన్. ౨౧

ఆ॥ వె॥ ఆటపాటలందు నతనితోడర్భకు
లుండ నామహాత్ముఁ డుర్వియందు
భక్తిశ్రద్ధ భవవిరక్తితో గూడుక
సలరు నదియు గాక నతని వాగు. ౨౨

ఉ॥ స్కూలుకు జీతమివ్వమని సొమ్మును యీతనికిచ్చి పంపనా
ధీలలితుండు వీధులను దీనులు గోచరమైన తోడనే
బాళిని వారికాధనము పంచి యొసంగియు వేగ తాను వి
ద్యాలయమందు నిల్వకయె దండి విరాగముతో చరించెడిన్. ౨౩

వ॥ పదంపడి. ౨౪

క॥ జనని మొదలైనవారీ, తనినంగడినుండి వస్తుతతులను తెమ్మం
చనుడబ్బునివ్వనదియును, తనకడనున్నంబరములుధర్మము సేయున్.

ఉ॥ ఇంతటి యీవి బాల్యమున సీధరలో నను యేరికుండనౌ
యొంతటి నిర్మలాత్ములకొ! యిట్టిసుబుద్ధి లభించుగాని వే
రెంతటి వారికైనను మహిన్ ధనమున్ విడ నిచ్చగల్గునే?
వింతను గల్గఁజేసెడిని వీరిసుచర్యల నెంచి జూచినన్ ౨౫

ఉ॥ ఓరి యటంచుఁ బిల్వఁదగియుండెడివారినిఁ గూడ యయ్యయం
చారసి బిల్చు నెంతొ వినయంబుగ నీవిమలుండు గాని దా
నేరికినేని కష్టముగ నే పనియున్ బొసరించడాయె నీ
సూరిజనాధ్యుఁడౌ ఘనుఁడు శోభితదివ్యగుణుండు నమ్రుఁడై. ౨౭

వ॥ అనంతరము. ౨౮

చ॥ బడి కొక పూట నేగి పగ వాసరమందున వెళ్ళ కెప్పుడున్
జడుని విధంబుగా తిరుగు సౌమ్యము తోడను నామహాత్ముఁడుం
చడు తన చిత్త మైహికపు సారవిహీనపు గోలలందు నె
ప్పుడు పరమాత్మయందు మదిఁ బొందుగ నుంచును గానినిష్ఠతోన్

ఉ॥ ఈలలి కొంత కాల మటు యింపుగ విద్యలు నేర్చుచుండనా
బాలున కంతకంతకును భావమునందు వివేకవృద్ధిగా
నేలను నస్థిరంబులగు యీ యిహవిద్యలటంచు కొండలం
బోలు విరక్తితో బడికిఁ బోవుట మాని యనంతరం బిలన్. 30

చ॥ అచటచటన్ వసించెడు మహాత్ముల నొద్దకు శ్రద్ధతోడ నే
గుచు సలనారితో పరముఁ గూర్చి ప్రసంగముఁ జేయుచున్ మహా
శుచిమతియై చెలంగుచును చోద్యము గల్గగ నిర్ధరిత్రి పూ
జ్యచరితుఁ డాతడుండు నిటు సద్గుణభూషణుఁడై వెలుంగుచున్.

మ॥ క్షమ శాంతాది గుణంబులన్ మణుల వాసస్థానమై యొప్పుచున్
విమలుండై విలసిల్లుచున్ విదితమా పీకన్ మహాత్ముండు దా
రమణంబైన సుబుద్ధిచే మెలఁగుచున్ రాణించుచున్ ధాత్రి శు
ష్మమునై నట్టి వివేక పూర్ణమతియై మాయాంధ కారార్కుఁడై.

సీ॥ పావనుఁ డీతడు బాల్యంబునందు నే
దేవతార్చనలను తేటగాను
గావించు ధరణిలోఁ గల స్త్రీలనందఱి
తల్లులురీతిగాఁ దలచియుండు

సర్వభూతములందు సమమైనదయగల్గి
సుజ్ఞానరత్నమై సొంపుమీఱి
వర్తించుచుండుఁ దాఁబాగుగా
నిమ్మహా వర్ణనీయుఁడు లోకపావనుండు,

తే॥ గీ॥ విదిత చారిత్రుఁడైన యీ ప్రథితగుణుఁడు
ప్రకృతి సంబంధములు లేని భవ్యమూర్తి,
కామక్రోధాదిగుణము లీ ఘనుని యందు
నెంచి చూచినఁ గాన్పించ వించు కేని. 33

ఉ॥ ఈగతి నుండ వీరు వసియించెడునింటికి కొంత దవ్వులో
ధీగరిమన్ వెలుంగుచును దివ్య గుణంబుల తోడఁగూడుచున్
బాగుగ నొక్క భవ్య సతి వర్తిలు చుండెను ధామణీస్థలిన్
ఆ గరితన్ మహాత్మ యని యారసి చెప్పఁగ శక్యమే ధరన్. 34

క॥ చందమ్మను నభిధానము
సంధాత్రిని విదితమైన నయగుణములతోఁ
పొందుగ వెలిగెడి యాసతి
సుందరగుణములను జూడ చోద్యము గల్గున్. 35

సీ॥ ధర జనులకు సహోదరివిధంబుగ తాను
వర్తించుచుండు నావర్ణనీయ
సురగణోద్భవయైన తరుణి యీ ధరణిలో
శాంతమూర్తియై జమూ సచ్చరితకు
పైఁబడి గొట్టినా పలుమారు తిట్టినా
కోపంబు నొందదా పాపరహిత
సద్గుణరాశియౌ సంతతోల్లాసిని
సజ్జనమిత్రయౌ సరసిజాక్షి,

తే॥ గీ॥ పరమ పావని ధీమతి భవ్యచరిత
నిర్మలస్థితిఁగల్గిన నిశ్చలాత్మ
చాలభక్తిని వెలయునాఁ జందమాంబ
మహిమ వర్ణింప శక్యమే? మానవులకు. ౩౬

మ॥ ఒక వేళన్ పదవిం జరించు నెడ నీయోషిత్తు కన్నెత్తి చూ
డక యే పోవును భవ్యమైన మదితో టాటోటు లేనట్టి యా
ప్రకటంబౌ సుచరిత్ర దివ్యసతి ధీ బాసిల్లఁగా నిమ్మహిన్
అకలంక స్థితి గల్గువారి కవి యత్యంతంబు మిత్రుల్ గదా! ౩౭

ఆ॥ వె॥ పంచ వత్సరముల ప్రాయము నందె యీ
భవ్యగుణవతి కిలఁబరమమైన
భక్తియుద్భవించెఁ బసితనమందునే
యెవరికబ్బు? నిట్టిప్రవిమల మది. ౩౮

మత్త కో॥ బొమ్మరిండ్లను గట్టి బాలికపొందుగా నొకబొమ్మ నం
దమ్ముగా నట నిల్పియున్ మది తన్కుచున్నటువంటి మో
దమ్ముతోఁ గుత తోడి బాలల దాను బిల్చుకవచ్చి నే
మమ్ముగల్గి పౌనర్భపూజలు మంగళంబు చెలంగఁగన్. ౩౯

చ॥ ఋతమును హింసయున్ దయయు రోషము లేనటువంటి మానసం
బతులిత భక్తిశ్రద్ధలును హార్దము తోడుత నీమెయందునన్
సతతము వెల్గెడిన్ మణులు జాంబవమందున తాచివేయ నే
గతి విలసిల్లునో యటులు కాంతిని దేరుచు ధారుణీస్థలిన్. ౪౦

ఉ॥ వాదము భేద మీమెయెడ వావిరిగా ను బరీక్ష జేసినన్
లేద రవంతయైన మదిలేబరమే యెవరేని దిట్టినన్
మోదముఁ జెందుగా నిలను మోడిని జెందదొకించుకేనియున్
సాధుజనాగ్రగణ్య యగు సాధ్వి మహాసతి ధాత్రిలోపలన్. ౪౧

మ॥ ఘనమౌ సద్గుణ ఖానియై మెలగ నా కాంతాలలామ ప్రవ
ర్తనలన్ గాంచిమహాత్మయంచు తనలోఁదా రంగయార్యుండు యెం
చినయంబా గుణవార్ధి యా విమలియే శ్రీమద్గురుశ్రేష్ఠమం
చును నీధీమతి యందుభక్తిగలుగన్ స్తుత్యుండు బాగొప్పగా. ౪౨

క॥ గురుభావ మీమెయందువ
బరువడి మానసమునందుఁ బాదుకొలిపి యా
తరుణీమణి కడకుంజని
పరమార్థ విచారణంబు బాగుగ సేయున్. ౪౩

మ॥ జననీ పుత్రుల మాడ్కి నీమహితునిన్ చందమ్ము యత్యంత ప్రే
మను జూచున్ మది వీరు నామె నిలలో మాంగల్యమౌభక్తి సే
యును నైర్మల్యమనంబుతోడ నెపు డీయుర్వీస్థ లిన్ పుణ్య వా
రినిధుల్ మాడ్కి వెలుంగునీఘనుల వర్ణింపన్ మహిన్శక్యమే. ౪౪

మత్తకో॥ ఇహామహాత్ములతోడ నెప్పుడు యింపుగాను చరించుచున్
మహిళయైనటువంటియీమెను మాన్యుఁడున్ గురు భాతిగా
సహజమందున నెట్టులెంచెను సాధువర్యుల నీతఁడీ
మ్మహిని జూడడ వారలన్ గురుమాడ్కి నేల తలంచడో. ౪౫

ఆ॥ వె॥ యేమికారణంబొ యీమహాత్ముఁడెప్పుడు
సాధుజనులతోడ సంచరించి
వారిలోనొకరిని భావింపకయె గురు
కరణి నీమె నెంచగాజగతిని. ౪౬

వ॥ అని నెడ, ౪౭

ఉ॥ ఈ వనితాలలామ ధర నీతఁడు జూచినవారికంటె బల్
చేవను బొల్చుచున్నవగు శ్రీగుణభూషణియై చెలంగెడిన్

గావున నీమె నిమ్మహినిఁ గ్రొన్నవ సద్గురు వంచు నీతఁడున్
భావము నుంచె నంచు మదిఁ బాగుగ నెల్లరు నెంచఁగాఁ దగున్.

కం॥ ఈనాతియు నీమహితుని
మానిత మగునట్టిజ్ఞానమహిమన్ గనియున్
యీనయగుణసంపన్నుని
తానును సద్గురుఁ డటంచుఁ దగ భావించెన్. ౪౯

ఉ॥ ఆవిధి నుండ నీఘనుని నారసి యీతని వీతరాగమీ
ధీవరుతల్లిదండ్రు లిలఁ దేటగు వీరి విరాగచేష్ట దా
మే విధినైనఁ బాపుటకు నెంచిన వారలరై వివాహమున్
పావనుఁడైన యీతనికిఁ బాళినిఁ జేయఁగ నూహఁ జేసియున్. ౫౦

కం॥ వైవాహిక మొనరింపం
గా వారు ప్రియత్నములను గావించుచు నీ
పావనుని తోడఁ జెప్పఁగ
నీవిమలాత్ముండు వారి కిట్లనిపలికెన్. ౫౧

ఉ॥ నాకు వివాహమే వలదు నైర్మలమానసుతోడ నుందు నీ
లోకమునందు నిప్పుడును లోగడయందున నెంతమంది పా
ణౌకృతిఁ జేసి కోరి మదినచ్చునుఁ బొందరె సౌఖ్యమున్న దే
జోకను వీటి నారయుచుఁ జొత్తునె బాముల కూపమందునన్. ౫౨

వ॥ నావుడు. ౫౩

శా॥ ఆవాక్యమ్ముల నాలకించియును వారం తంత యోజించియున్
ప్రావీణ్యంబున నెట్టులే నితనికిన్ పాణౌకృతిం జేయఁగా
భావం బందున నెంచి కొందఱి కడన్ బా గొప్పఁగా వీరికిన్
చేవం బొల్చెడు బోధనంబు లిలలోఁ జెప్పింపఁగా నంతటన్. ౫౪

ఆ॥ యెన్ని చెప్పిన వినకున్న సీవిమలుని
బుద్ధి మదిని గాంచి బోధ జేయు
వార లిట్టు లనిరి వసుధలో సీతఁడు
పరమపావనుండు విరివిగాను. ౫౫

చ॥ అగుటను నీమహామహుని కట్టివివాహాపుటిచ్చ లే దిలన్
సుగుణఖని ప్రితీతమగు శుభ్రచరిత్రుఁడు గాన సీతనిన్
తగ విడుఁడేమి సేయక యె ధాత్రి నటంచు వచింపఁగాను నీ
జగతిని వారి నేమనక శాంతిని నుండిరి తల్లిదండ్రులున్. ౫౬

ఉ॥ పండి తనంత రాలి పడుపండును యెత్తి కుజంబు మీఁద నీ
ఫుండు మటంచుఁ బెట్టి నను నుంచునె యివ్విధి నే తమంతటన్
దండుగ నైహికంబు లెడ తాపరమైన విరాగులౌ మహా
పండితవర్యు లొప్పుదురె? బాములకూపమునందునన్ బడన్. ౫౭

సీ॥ ఈ రీతినాధీరుఁ డిహబంధములు త్రెంచి
వైరాగ్యవంతుఁడై వసుధలోన
ఘనమైనసద్గుణఖనియై వెలుంగుచు
నలఘుఁడై ధరణిఁ దా నలరుచుండి
పరమార్థబుద్ధియున్ ప్రబలంబుగాఁ దిన
దినమున వృద్ధినిఁ గనుచునుండ
జ్ఞానధనము నొంద మానుగానూహించి
మాటలాడుట మాని మౌనయోగ,

తే॥ గీ॥ ముసు వహించియు సుజ్ఞాన మనెడు పదవి
కొఱకుఁ దాను ప్రయత్నముల్ విరివిగా నొ
నర్చుచుండియు ధాత్రిలో నయముగాను
మరితనాశనుఁడైన యీ వరహితుండు. ౫౮

పంచచామరము.

పరోపకారబుద్ధితోడఁ బాగు మీఱ నీతఁడున్
సరాళ మొప్పగాను తాను చక్కఁగాను గన్నయా
విరాజితంబునౌ పద్ధతిన్ సవిస్తరంబుగాఁగ నీ
ధరిత్రియందు బోధఁ జేయు దా మనుష్యపాళికిన్. ౫౯

ఉ॥ మౌనము దాల్చి యేగతిని మాటల నాడె నటంచు నందు కే
మో నయ మొప్ప దానికిని ముందుగనే యిట తేట పర్చెదన్
మౌన మటన్న శుద్ధమగు మౌనముగా దది యెట్టిదన్న నీ
ధీనిధి యక్కరై నెడల తేకువతోడుతఁ బల్కుచుండెడిన్. ౬౦

వ॥ కావున. ౬౧

కం॥ అవసర మీమహనీయున
కనవిజనావళికి నెల్ల నమల సుబోధన్
డలిపి యొనర్పఁగ ధాత్రిని
నపుటను నల వారికొరకు నాతఁడు పల్కెన్. ౬౨

తే॥ గీ॥ అంతియేగాని యీధీరుఁ డవనియందు
శుద్ధమైనట్టిమౌనంబు సొంపుమీఱఁ
బూనలేదెన్న డగుటచే జ్ఞానబోధఁ
జేసె నంచును నిచ్చోటఁ జెప్పవలసె. ౬౩

వ॥ అదియునుంగాక. ౬౪

ఉ॥ చిన్నతనంబునుండియును జేవను బొల్చెడు బోధనంబులన్
మన్నన గల్గి యీఘనుఁడు మంతువుతోడుత ధారుణీస్థలిన్
పన్నుగఁ జేయుచుండెడిని బాగుగ వీరి సుచర్యలేరి కౌ
నెన్నగ శక్యమే మదిని యెన్నివిధంబుల నెంచిజూచినన్. ౬౫

శా॥ ఈదివ్యాత్ముఁడు తల్లిదండ్రులకు దా నింపై విరాజిల్లుధీ
బోధల్ జేయును దౌష్ట్యభావమిలలో పోకార్చిసద్భావముల్
పాదుర్భావముఁ గల్గఁజేయుటకునై బాగొప్పఁగా శేముషీ
సాదమ్మొ మతిమంతుఁడీయనఘునిన్ శ్లాఘింపగాశక్యమే. ౬౬.

ఆ॥ వె॥ ఇంటఁగల్గువారి కెల్లరికి నితండు
దివ్యమైనబోధ తేటఁబడెడు
తీరుగా నొనర్చె ధారుణి నదియును
గాక నీఘనుండ జోకతోడ. ౬౭

కం॥ ఒకతరి నీతనివారలు
ప్రకటితముగ తీర్థయాత్రబాగుగ జనని
యకళంకుడె యీగతి వా
రికిబోధలఁ జేసెనపుడు శ్రీకరబుద్ధిన్. ౬౮

సీ॥ తీర్థయాత్రలవెంటఁ దిరిగినచోఁగల్గు
ఫలితమేమియులేదు వసుధలోన
దేహపరిశ్రమ తీక్ష్ణంబుగాఁగల్గు
ధనవ్యయంబును గల్గు ఘనముగాను
యారీతిగా ధనవ్యయముజేయుటకంటె
దాన ధర్మము మీరు పూనిచేయఁ
జాలరే యిటువంటి గోలలందునఁజిక్కి
నేల వట్టిభ్రాంతి యే సుమీఁయిది,
ఆ॥ వె॥ యంచు బోధఁజేసె నామహానీయుండు
విమలబుద్ధి తోడ విపులముగను
బాల్యమందెయిట్టి పరమకృత్యములను
యెవరుసేయనేర్తు రీధరిత్రి. ౬౯

భూతిలకము.

వీరలు బాల్యమునుండి భవ్యవివేకబోధను జేయునా
తీరున మౌనమునందు నుండియు దివ్యమైనసుబోధనల్
చేరి పౌనర్భుచునుందు రెప్పుడుఁ జెన్నుగాజనపాళికిన్
ధీరుఁడు పావనుఁడైవెలింగెడి ధీసుభూషణుఁ డాతఁడున్. 20

కం॥ ఈమాడ్కిని నుండఁగ నీ
పామరగుణరహితు గురువుభవ్యచరితయా
ధీమతి యాచందమ్మయు
తామహిలో దేహయాత్రఁదగముగించెన్. 21

సీ॥ అపుడీసుధీవరుండకళంకమతియైన
యాదివ్యసాధ్వీకినవనియందు
నుత్సాహ మొప్పఁగా నుత్సవంబులను దాఁ
జేయించుచుండునుశ్రీకరముగ
నీమెయందున వీరికెంతటి భక్తియో
వర్ణింపశక్యమే వసుధలోన
మౌనియై యుండియున్ మహితుఁడీమెకు నుత్స
వముల జేయించెను బాగుగాను.

తే॥ గీ॥ పరమపావనుఁడైన యీవరగుణునకు
భక్తిశ్రద్ధలు నీమెపైఁ బ్రబలముగను
నున్నవంచును మదిలోన నుర్వియందుఁ
జక్కగాఁ దెలియఁగ నిదె సదృశమగును. 22

వ॥ పిమ్మట. 23

ఉ॥ కొన్ని దినంబు లీఘనుఁడు గూర్మిని మౌనమునందునుండియున్
వన్నెను వెల్గుచున్నదగు భవ్య ప్రిమన్ గనుగొన్న పిమ్మటన్

సఖిల దుఃఖములను హరియించఁ జేయఁదగినఁ
విమలమైన బోధనము లొనర్చె. ౨౪

సీ॥ అనఘుఁ డీమహనీయుఁ డజ్ఞానమును బాపు
బోధనంబులు పెక్కు లీధరిత్రిఁ
జేసెనైనను గాని భాసురంబుగ వీరి
బోధనంబుల నూని పుడమి సర్వ
సంగంబులను వీడి సన్న్యాసమును బూని
వసుధ జ్ఞానానందవాణి యనగ
వెలయనొక్క యువిద విమలసద్గుణ
వతియై వెలుగొందుచునామె గాక;
తే॥ గీ॥ నింకకొందఱు సజ్జను లీమహాత్ము
నంచితంబగు బోధల ననుసరించి
భక్తజనసమాజంబను భవ్యనామ
మలర నుండిరి ధాత్రిలో నక్కజముగ. ౨౫

క॥ మహి దేహావియోగమునీ
మహనీయుఁడు పొందెనైన మరల జన్మం
బిహలోపల నెత్తనవిధి
మహితులు ప్రియ శిష్యులొకరు మాన్యనకుండెన్. ౨౬

సీ॥ అజ్ఞానమని యెడి నంధకారముఁ బాప
నీజ్ఞానిబోధయే యినుని కాంతి
కామక్రోధాదిగాఁ గలశత్రుల జయింప
నీమహితునిబోధ నెంచ బలిమి
రాగమును నసూయ త్యాగంబుఁ గావింప
నీగుణనిధిబోధ యేమహితము




ఘనమైన పరమార్థ మనుభాగ్యమొసఁగ నీ
ఘనునిసుబోధయే గాంచదాత;

తే॥ గీ॥ గాన శుభకరమైన యీజ్ఞానిబోధ
నములను గ్రహించి యెల్లరు నయముగాను
మనసునందున నెప్పుడు మఱువకుండ
సల్పినెడ సద్గతిని గందురు జగతి యందు. ౮౭

సుగంధి॥ దేవదేవ! పాపనాశ! ధీవరా! గురూ! హరీ!
శ్రీవిశిష్టమైనధీసుసేవధీ! మహాత్మ! యో
పావనా! పరాత్పరా! సుభక్తవందితావ్యయా!
భావుకమ్ము నై వెలుంగు భవ్యధీ! సుభూషణా! ౮౮



ఓం



సద్గురు

# శ్రీ రంగావధూతలవారి

## జ్ఞానబోధ.

---

ఉ॥ కన్నులులేనివారు దివిఁగాంచఁగలేక దివాకరుండు లే
డన్నవిధంబుగా జగతినంతటనిండి వెలుంగుదేవునిన్
గ్రన్నన భక్తిహీనులిటుఁ గాంచఁగలేకయె దేవుఁ డెందులే
డన్నను చెల్లునే! యివియు నజ్ఞులవాక్కులు గావె చూడఁగన్. ౧

ఉ॥ మౌక్తికసంగ్రహాలుండయిన మానిసి యమ్మహి నెక్కుడైనయా
సక్తిని వారిధిన్మునిఁగి సాహసికంబునఁగష్టమొందియా
మౌక్తికమున్గనుంగొనెడి మాడ్కిని దేవునిఁ జూడనెంచినన్
భక్తియుశ్రద్ధలన్ సలిపి వావిరియా శ్రమలొందిగాంచనౌ. ౨

చ॥ ఘనమగుపారమార్థమును గాంచ పరాత్పరు నెప్డు ధాత్రిలో
ననయము భక్తి సేయుచును నైహికవాంఛల నించు కేనియున్
మనమున నుంచకుండ నవి మాపు నొనర్చియు నిశ్చలస్థితిన్
గనుఁగొని యుండె నేని మది గాంచగనౌ పరమార్థ భాగ్యముల్ ౩

చ॥ అగణితభక్తిచే భగవ దర్చనఁ జేయుచు నిర్మలాత్ములై
జగతిని గల్గుసర్వసుఖములు జాలము లంచు మనంబునందుఁ దా
ము గణుతిఁ జేసి భ్రాంతులు సమూలముగా నెవ రుత్తరింతురో
తగ నిల వారలే ఘనులు ధన్యులు ధీరు లటంచుఁ జెప్పనౌ. ౪

చం॥ ధర విషయంబులే దమకు దైవము లంచుఁ దలంచుచున్ మదిన్
విరివిగ దేవభక్తి నిల ప్రేమము తోడుతఁ జేయలేక సూ
కరముల మాడ్కిగాఁ దిరుగు కల్మషచిత్తులు వేగిరంబునేఁ
బరువడి ఘోరమౌ నరక బాధలలోఁ బడి పోదు రిమ్మహిన్. ౫

కం॥ అంగారంబుల నేగతి
బంగారము నేవిధమున భావింతురొ యా
భంగిని లోకముపైనను
మంగళకరు దేవు నెడను మది నుంచవలెన్. ౬

చం॥ పెఱతలపుల్ మనంబునను బెట్టక నిశ్చలమానసంబుతో
నురువడి భక్తిశ్రద్ధలను నూతఁగఁ జేకొని యెల్ల వేళలన్
తెఱవు ధరాతలంబునను దేవుఁడె నాకని నిశ్చయంబుగా
సరవిని నెంచి దేవు నిల సంస్తవమున్ బొనరింపఁగా వలెన్. ౭

మ॥ అనయం బీగతి దివ్య మానసముతో ధ్యానంబుఁగావించుచున్
మనమున్ దేవుపదారవిందములపై మగ్నంబునొందించియున్
తనువుంగూడ నెఱుంగకుండ నెపుడున్ ధాత్రీతలంబందు వే
గనయంబైన పదంబు వేడుకలరన్ గాంచంగనౌ బాగుగన్ ౮

చం॥ తన పరిపూర్ణ మానసమె ధాత్రిశుభంబు నొసంగు దైవమం
దున నిసుమంతయేని సుఖదుఃఖములన్ గలిగించునట్టియా
గొనములు లేవు గావునను గూరిమితోడుత నమ్మకంబుతో
డను పరమాత్మ నెప్పుడును డంబుగ వేడుచు నుండఁగావలెన్. ౯

కం॥ మరియును ధారుణిలో నొక
పరమాత్మయె సర్వవ్యాపి బాగుగనంచున్
విరివిగ భేదంబులనిడి
సరగున సర్వంబు దైవసమముగ మదిలో. ౧౦

ఉ॥ ఎంచుచు బ్రహ్మ విష్ణువు మహేశులు మున్నగు సర్వమూర్తులం
దించుక నైన భేదముల నిమ్మహి లోపల మానసంబునం
దుంచక యెట్టిమూర్తి యెడ నుండును మానస మట్టిమూర్తినే
పంచమమైన భక్తి నిలఁ బాగుగ దానిని వేఁడఁగావలెన్. ౧౧

కం॥ తన మనసే దేవునెడన్
ఘనభక్తిం గలిగియుండుఁ గాంచఁగనా దే
వుని నెల్లవేళ నారా
ధనఁజేయుచు నుండవలయుఁ దగిననుబుద్ధిన్. ౧౨

కం॥ మోక్షము దక్క నితరపుట
పేక్షల నన్నిటిని వేగవీడియు మోక్షా
పేక్షమనంబున నుంచియు
నక్షయమగు భక్తి దేవు నారాధనముల్. ౧౩

కం॥ గావించుచు నిసుమంతయు
భావంబున పెఱతలఁపులఁబట్టింపక స
ద్భావముతోడుత దేవుని
సేవలనే చేయువలయు శ్రీకరలీలన్. ౧౪

కం॥ ఇతరులచేతను భూషణ
లతులితముగ నొందుకొలఁకు నవనీస్థలిలో
హితవుగ దేవునిపూజలు
జతపడియొనరించి నెడలసంగతితోడన్. ౧౫

కం॥ ఫలమునుగాంచఁగఁజాలరు
తలఁపఁగ నిసుమంతయైనతగనిలలో గా
నలలామమైన బుద్ధిని
తొలగింపఁగ వలయు నట్టిదుష్టతలంపున్. ౧౬

మ॥ ఇలలో నాకలిలేనిమానవులుదా మింపొంద నాహారమున్
తలఁపంగాఁ దిననిచ్ఛఁజేయ రిటులే దైవంబుపై భక్తిలే
కలలిన్ బుద్ధివిహీనులై చెలఁగుచున్ నాకృత్యముల్ చేయువా
రలు పూజాదులయందుఁగొంచమయినన్ శ్రద్ధాళువుల్ గారుగా. ౧౭

కం॥ ధర వస్తువులన్నింటిని
విరివిగ దైవస్వరూపవిధముగ మదిలో
పరిపూర్ణభక్తితోడుత
నరయుచునుండంగవలయు నధికసుభక్తిన్. ౧౮

ఉ॥ ఇట్టి సుబుద్ధియే ఘనుల కింపుగ నుద్భవ మొందునొగదా!
అట్టిమహాత్ము లీధరణి నవ్యయమై యలరారుచున్న యా
యిట్టలమైన సౌఖ్యపద మింపుగ సంశయ శూన్యచిత్తులై
నెట్టనగాంతు రంచు నిల నిక్కముగా వచియింపఁగాఁదగున్. ౧౯

కం॥ ధ్యానముఁ జేయునపుడు తన
మానస మిసుమంతయైన మాలిన్యములో

హీనవిషయజాలంబుల
లోనికిఁ బోనివ్వకుండ లోబఱచితగన్. ౨౦

కం॥ నిశ్చల చిత్తముతోడుత
నాశ్చర్యకరముగ దేవుధ్యానంబిలలో
నిశ్చింతను గావించుచు
నిశ్చేష్టితులైనయెడల నిశ్రేయసమున్. ౨౧

తే॥ గీ॥ నివ్వటిల్లును ధాత్రిలో నిజముదీని
కించుకేనియు సందియం బెంచఁగూడ
దంచితంబగు ముక్తిని గాంచఁదలచి
నెడలనిశ్చలధ్యానమే పడయవలయు ౨౨

కం॥ ఏకాంత భక్తి నల్పుచు
జోకను విషయేషలనెడు శోకకరములన్
పోకార్చినిశ్చలస్థితిఁ
జేకొని పరమార్థపదవిఁ జెందగవలయున్. ౨౩

కం॥ తగ నిష్టదేవుపదముల
నగణితముగ భక్తితోడ నవనీస్థలిలో
నగరిమచేతను నిశ్చల
మగుధ్యానముఁజేయువలయు నధికసుబుద్ధిన్. ౨౪

కం॥ నవరంధ్రింబులు గలిగియు
భువిలోపలఁ జీమురక్తమును మాంసముతో
డవసామయమై యున్నత
నువు రోతను యిట్టిదంచు నుడువగవలె మే! ౨౫

కం॥ తలపఁగ నతిహీనయంబగు
మలమూత్రము చేత నిండి మలినములొ పే

గులు కండలు క్రిమిజాలము
కలిగి ధరాతలమునందుఁ గడు హేయములౌ. ౨౬

కం॥ నరములు చర్మముగల్గియు
నరయఁగ బలువైనకీళ్లు నస్థులతోడన్
విరివిగ దుర్గంధముతో
ధరణిని చరియించునట్టి తనువిదిచూడన్. ౨౭

కం॥ జననము మరణము జాడ్యము
లన ఘనవేదనలతోడ నరయుంగా ధా
రుణిలోపల జలబుద్బుద
మనఁదగివర్తించుచుండు నస్థిరగతితో. ౨౮

కం॥ బాలత్వము కౌమారము
తాలుచు యవ్వనము ముసలితన మనఁగ నిలన్
నాలుగవస్థల నెప్పుడు
వాలాయము వీనియందు వచ్చెడి బాధల్. ౨౯

తే॥ గీ॥ వర్ణనముఁజేసి చెప్పగావసుధలోన
శక్యమే యేరికేనియుఁ జాలగాను
ఇట్టి కష్టముల్ మనసులో నెంచిచూడ
యెచ్చటైనను నుండునే నచ్చుగాను. ౩౦

ఉ॥ కావున ఘోరబాధల కగారముగా విలసిల్లుచున్నయీ
చావును పుట్టువుఁ ముదిమి చాలఁగ బాల్యము యౌవనంబుతో
నీవసుధాతలంబునను నించుక సౌఖ్యము నొందఁజాలకే
కేవలదుఃఖఖానియయి కృచ్ఛ్రములంబడి పోవునెప్పుడున్. ౩౧

కం॥ ఇటువంటిశరీరముపై
తటవిటమగు మోహ మంది ధారుణిలోనన్

చటులంబగు వేదనలను
తటికునఁబొందంగనేల? తగ నీభ్రాంతిన్. ౩౨

కం॥ విడిచియు వేగిరమే బడు
వడి దీనితెరంగెఱింగి బాగుగ మదిలో
కడువడి మోక్షానందముఁ
బడయగ యత్నించవలయు భవ్యమనీషన్. ౩౩

కం॥ ఇల ధనసతీసుతులపైఁ
దలపగ మోహంబునొందె తగమదిలోనన్
జెలఁగుచునుండుటచే కే
వలదుఃఖముగాంత్రు దీన బాగుగనెపుడున్. ౩౪

కం॥ అరసి మహాఘోరంబగు
నరకము ధనసతియు సుతులసంబడునవి యుం
చెరఁగియునీవిషయంబులు
పరితాపకరంబులంచు వసుధాస్థలిలో. ౩౫

కం॥ ఇంచుకభ్రమ వీనిపయిన్
నుంచక యతివేగ చెండియును మరి మదిలో
నెంచగ ఘనదుఃఖములని
చంచలమగుతృష్ణ లెల్ల సరగున విడనా. ౩౬

కం॥ సతియను జాలములోఁబడి
వెతలొందుటకంటె ధాత్రి భీకరశిఖిలో
దృతమునఁబడి దుఃఖము సం
తతమును గనుగొనుటమేలు దైవారంగన్. ౩౭

కం॥ సుతులనగాఁ దన నెప్పుడు
నతులితముగ దుఃఖకూపమందునఁ ద్రోయన్

ప్రతిహింసఁ జేయబుట్టువి
తత యమభటులంచు మదినిఁదలపఁగ వలయున్. ౩౮

క॥ అర్థము పరసౌఖ్యంబును
వ్యర్థము గావించి దుఃఖమందించి ధరన్
సార్థక మొసఁగదు గాని ని
రర్థకమగుదీనిపొత్తునగు విడువంగన్. ౩౯

క॥ యోషా ధనసుతులనఁబడు
యీషణములయందు ధాత్రినించుకరైనన్
యేమలులేనెడ జ్ఞానస
భూషణము లభించి సౌఖ్యములు చేకూరున్. ౪౦

ఉ॥ తల్లియుఁ దండ్రి బాంధవులు ధారుణిలోపలఁ గల్గియున్నయీ
యెల్లరు నిత్యమంచు మదినెంచి భ్రమించి చరించిరేని దాఁ
దల్లడమంది దుఃఖమును తక్షణమే గనఁగల్గుఁ గావునన్
కల్లయటంచు సర్వభ్రమఁ గ్రిన్నన వీడగనౌ మనంబునన్. ౪౧

క॥ అతిహేయములగు విషయము
లతెరంగు నెరింగియును లల్లామమయినన
స్మృతితోడుత నెల్లప్పుడు
నతిశయమగుదుఃఖములను హతమొనరుపనౌ. ౪౨

క॥ ఎంచగ సంసారంబును
మించిన ఘనదుఃఖవనధి మేదిని గలదా!
సంచిత జాలంబులచే
వంచనఁ గావించుచుండు బలువుగ నెప్పుడున్. ౪౩

క॥ కన సంసారము విషయము
లను వానికి ఖానియై మహాకూ్రరంబౌ

ఘనదుఃఖంబులతోడను
ఒనరుగ విలసిల్లుచుండు నుర్వీస్థలిలో. ౪౪

కం॥ ఇది యొక ఘనజాడ్యముగా
మదిలోపల నెంచవలయు మహీ నీజాడ్యం
బొదకుని బాపుకొరకునొ
పధమేదియు లేదు ఘనవిషయములపైనన్. ౪౫

కం॥ యుక్తముగా ఘనమైనవి
రక్తినిఁ గనియున్నవీత రాగాపధమే
ముక్తముఁ జేయును దానిసు
శక్తియిదే సంచితముఃలు సరగునఁ ద్రుంచున్. ౪౬

కం॥ సంసారంబే శత్రువు
సంసారంబధికమైన సంతాపం బా
సంసారముచేఁ గల్గెడు
హింసల నిటునంటివంచు నెన్నగవశమే? ౪౭

కం॥ సకల విషయజాలంబుల
నకలంక మనంబుతోడ నవనీస్థలినే
రు కడువడి విడెదరో వా
రికి హస్తామలకమౌను శ్రీకరపదముల్. ౪౮

కం॥ తలప విషయజాలములోఁ
జెలువుగ సుఖమున్న దనుచుఁజెప్పెడి వారల్
తులతూగుచు దుఃఖముచే
కలవరపడు చుందు రకట! కలకాలంబుల్. ౪౯

ఉ॥ దరియును నంతులేనిదయి దాటుటకైనను వీలులేక భీ
కరమగు మోహలోభ మద కామము మున్నగు ఘోరమాగ్రహ

కరమయి దుఃఖతోయములు గల్గినసంసరణంపు కూరసా
గరమున మున్గు వారిలనుఁగాంచగ లేరిసుమంత సౌఖ్యముల్. ౫౦

ఉ॥ గానను యిట్టిఘోరమగుగాటపుబాధలలోనఁ జిక్కకే
బూనగనా విరాగమును భూతదయాప్తియు శాంతబుద్ధియున్
మానము దివ్యచింతయును మార్ధ్వ్యగుణంబుల శూన్యచిత్తమున్
జ్ఞానము నీయ నియ్యవియె సాధనలంచు నెఱింగి యిమ్మహిన్. ౫౧

ఉ॥ దీపికమీదరాలుచు మృతిం గను పుర్వులమాడ్కి దుర్జనుల్
పాపపుటైహికంబులకుఁ బాల్పడిపాడయిపోదు రక్కటా!
దాపున నెందరో మహిని దండుగయేమలఁజిక్కి ఘోరమా
నాపదలొందుచుండుటను నారయుచుండియు బుద్ధిహీనులై. ౫౨

కం॥ ముందరిచేటునెరుఁగక
బంధంబున తిండికొరకుఁ బడి యావెనుకన్
కొందఱమందెడు నెలుకల
చందంబున నాశనేతజగతీస్థలిలో. ౫౩

కం॥ బహుదుఃఖాస్పదమౌనీ
యిహసుఖకాంక్షలనుజిక్కి యెంతో తరుచా
తహతహపడుదురుమాయా
మహిమముఁగనుగొనగలేక మౌర్ఖ్యజనంబుల్. ౫౪

కం॥ ధర నెలతలమాతలవలె
విరివిగపురుషులజనకులవిధి దలచిమదిన్
కొరగాని భ్రాంతులుడిగియు
పరమార్థముకొఱకు వేగఁ బాటునుపడుడీ. ౫౫

చం॥ అడవిని సర్పమున్నరికి యావలవైచినఁ దోడనిల్వకే
చెడుగగుజంతుజాల మిల శీఘ్రముగాఁ బరువెత్తి పోవుకై

వడి నరివర్గమున్ మదిని వర్జనఁ జేయమనోవికారముల్
విడివడు గాన వీని నిల వీడవలె న్వానిఁ జెందినట్లుగన్. ౫౬

చం॥ మనసునకుండునట్టి బహుమాధ్యపువృత్తుల నెల్లఁ జెందుచున్
గుణరహితంబు నొందుటకుఁ గూరిమి నాత్మవిచారణంబు నే
బొనరుపనా మహీస్థలినిఁ బొందుగ నిర్గుణమైన మార్గమున్
గనుగొన నీవిచారణయె గావలెఁ గావున దీనినెంచుచున్. ౫౭

కం॥ అనృతములాడుటయునిలక
గుణరహితము ఖలుల చెలిమి రోషపడుటయున్
ఘనమగుదోషంబులుగా
ననునలిపీడంగవలయునయముగ ధరలో. ౫౮

కం॥ మమకారమహంకారం
బు మొదలుగనుగల్గునట్టి ముష్కరచేష్టల్
సహాయించి వేగిరంబున
విమలంబగు స్థితినిఁ గన్న విశ్రాంతియగున్. ౫౯

కం॥ మనసున కీధారగు
ననుసరియగు నట్టితోవ నయముగఁ జూడం
గను యేదియు సాటిగ లే
దని చెప్పగ సందియంబు నరయగ గలదే? ౬౦

కం॥ చేతస్సును లోఁబరచిన
భూతలమున సర్వదుఃఖముల మించియు ని
ఖ్యాతంబగు పరమార్థము
చేతోమోదంబుతోడఁ జెందుదు రెపుడున్. ౬౧

శా॥ స్వాంతంబే ఘన సౌఖ్యదుఃఖములునున్ సంసారమున్ ధాత్రిలో
నెంతేనెక్కువయావివేకపదమున్ యేపైన భాగ్యంబులున్

ప్రాంతంబున్ మరిమధ్యమున్ తుదయునీ ప్రాణాంతమున్ పుట్టువున్
భ్రాంతి భ్రంశము పుణ్యపాపములు ప్రాపంచంబుసర్వంబిలన్. ౬౨

కం॥ మననవబడియెడి దానినిఁ
గనుగొన నెవ్వారికైనఁ గానియశక్యం
బనఁ జెల్లును గాదే! మన
ననగానలదానిమహిమ నారయవశమే. ౬౩

కం॥ కొండగుహలు కానలయం
దుండియు నచ్చోటఁ జాలయుగ్రపుబాధల్
మెండుగ నొందుచునుండెడి
దండితపసులెరుగ కష్టతరమగు మనసున్. ౬౪

ఆ॥ వె॥ గాలినైనగాని కరతలమందునఁ
బట్టవచ్చు మనసుఁ బట్టరాదు
నింతమహిమయంచు నెంచగా శక్యమే!
మానసికపుమహిమ ఘనముగాను. ౬౫

కం॥ స్వాంతముమాయయె మాయయె
స్వాంతము గావునను దీనిసరవినిఁ గనియున్
మంతువులోద్భుత వేగమె
ఆంతర్యపుస్థితులనెల్ల నారయవలయున్. ౬౬

ఆ॥ వె॥ పాదతలమునందు పత్రిసూచిగుచ్చు
కొనగ కంటకంబునను దులిచెడు
విధిని మనసులోడ హృదిని వీడఁగఁజేయ
వలయు నెల్లవారు బాగుగాను. ౬౭

శా॥ లోకాలోకములెల్లఁ గెల్చి తనకున్ లోఁజేసుకోవచ్చునా
జోకన్ దట్టములైన ముండ్లపయినన్ సూటిన్బరుండగనా

మాకీయాపద లేదటంచనగనా మాహాత్మ్యముల్ జేయనా
సాకల్యంబు నెరుంగనా గగనసంచారంబుఁ గావించనా. ౬౮

కం॥ మరి పరకాయప్రవేశము
విరివిగఁ జేయంగనాను వేడుకతోడన్
పరగ సమాధికి మేమిక
నరిగెదమని చెప్పుకొనగనా మున్ముందన్. ౬౯

ఆ॥ వె॥ అకట యెన్నిమహిమ లైనఁ జేయఁగనాను
గాని ధాత్రిలోనఁ బూనికలర
నాశ యనెడి దాని నరసి నాశముఁజేయ
వశముగాదు యెంతవారికైన. 20

కం॥ యెలుకలు పిల్లులకుం గ
న్నులు లేకయె యున్నయెడల నొవ్వఁగఁజేయుఁ
వలువిధుల నిట్లు జాగ్రత
తొలగిన చోహృదినిఁ జొచ్చి దుష్టగుణంబుల్. 2౧

కం॥ ఘనబాధలఁబెట్టును గా
వున వీని నెరింగి నెరుకఁబూనియు వేగఁ
మనసున జాగ్రతఁ దొలగినఁ
బని గలిగియెయుండవలయుఁ బ్రౌఢిమతోడఁ. 2౨

ఆ॥ వె॥ మనసు నెరుగఁజేయ మహి నేదియునులేదు
మనసుచే నఖిలములును దెలియును
గాన నేవిషయములేని మనసుచేత
మనసునెరుగవలయు మానుగాను. 23

కం॥ సంకల్పంబొదవకమును
సంకల్పముఁ గల్గిమరల సమసినపిదపఁ

శంకరహితసుఖమొదవుఁగ
సంకోచములేదు దీని సరసతతోఁడఁగ. ౨౪

కం॥ యెరుగం జాలక యజ్ఞులు
విరివిగ సంకల్పమొందువీకను బడియుఁగ
తరుగనిదుఃఖములోఁబడి
తెరవెరుగకఁ గుందుచుంద్రు తీరుగనెపుడుఁగ. ౨౫

కం॥ యెల్లప్పుడు నొకరీతిగ
యుల్లంబును నిల్పువార లొప్పుగ మదిలో
నుల్లాసముఁ గనుఁగొందురు
తల్లడమునుఁ గనరు నారుతగఁ జిత్తములో. ౨౬

కం॥ పరదోషములెన్నంగడు
తొరగాఁగాన్పించినల్పదోషము లైనఁగ
పరగన్వదోషంబులుదా
మరయుగఁ గనరావయెంత వైనను గానీ. ౨౭

కం॥ ఘనమగు రోగంబిదియే
ఒనరుగ మదిబాగుఁజెంద కుండుటకిదినా
శనమునుఁ జెందినచో బా
గునుఁ గనుగొనుసర్వజనము కూరిమితోడన్. ౨౮

శా॥ సర్వాఘంబులు వీడుచున్ విమలుఁడై సద్వర్తనల్ గల్గియున్
నిర్వేగంబు సుబుద్ధియున్ స్థిరతయున్ నిర్వైరమా స్వాంతమున్
నిర్వాదంబు చెలంగగన్ త్రిగుణముల్ నిర్మూలముంజెందఁగా
నిర్వాణుండయి యున్నవాఁడొకడెగానేమమ్ముగా నెప్పుడున్. ౨౯

శా॥ ఆచార్యుండన నొప్పగాని యిలలో నన్యాయకృత్యంబులన్
బ్రాచుర్యంబుగఁ జేయుచున్ విరివియై ప్రాగల్భ్యమైనట్టిదా

వాచాలత్వముఁ జూపుకొంచుగురువుల్ బాగొప్ప మేమంచుదా
సాచవ్యంబొక యించుకేని గనకేనంచారముల్ జేయుచున్. ౮౦

తే॥ గీ॥ అధికసంకల్పమయులరై యలరుచుండు
రట్టివారలగురువర్యు లంచు నమ్మ
వారు పొందెద రిక్కట్లు ఘోరముగను
గాని సుఖ మించుకేనియుఁ గాంచలేరు. ౮౧

కం॥ గానను యిట్టి గురువులను
జ్ఞానులటంచెరిగి వారి కాకృత్యములన్
మానుగఁ దెలియక యాధీ
హీనుల నమ్మంగఁ జెడుదు రిమ్మహిలోనన్. ౮౨

ఉ॥ ఇంతకు నెంచి చూడ నొక యించుక సంగములేని దివ్యుఁడే
సంతత మింపుమీరగను సద్గురుమూర్తి యనంగ నొప్పుఁ దా
నంతియె కాని జాలముల నగ్గలమౌగతిఁ బన్నుకొంచు బల్
తంతులుఁ జేయుచున్ జెలగు దాంబలుగారుగ సద్గురూత్తముల్.

కం॥ వేదాంతులగము మాకే
బాధలును లభించ వెటుల వర్తించినగా
నీధాత్రి నసెడి దుష్టులు
వేధనలే పొందగలరు వేగిరమె మదిన్. ౮౪

కం॥ రాగద్వేషము లనునవి
బాగునుఁ గల్గించనట్టిపాపులు గానన్
నేగినిఁ బాయుగఁ దలఁచిన
వేగమె యవి పీడవలె వివేక మనీషన్. ౮౫

చం॥ సలిలముచేత నానుచును చల్లగనుండినయగ్గిపుల్లదా
వెలుగదు మెంత రాచినను వేడిమిగా దొక యించుకేని యీ

లలిని విచారవారినిధిలగ్నమునై తనదుస్వభావచే
ష్టల నెడఁబాసినట్టి మతి సంస్కృతమై యట కేఁగ దెన్నడున్. ౮౬

సీ॥ జననంబు మరణంబులను బాధలకు మనః
కల్పవికల్పమే కారణంబు
గాన దుఃఖసహితమైనపుట్టువుచావు
లెడఁబాయఁదలచినఁ దడవుసేయ
కయె వికల్పమును సంకల్పంబు లనఁబడు
చిత్తవికారముల్ చెండివేయ
వలయును సంకల్ప మిలఁ నెప్పుడు నసింప
నపుడె జరామృతు లంతరించి.

ఆ॥ వె॥ నిరుపమానవసతి నిశ్చయముగను ల
భించుసంశయ మిల నించుకైన
లేదటంచు సమ్మగాఁడగు నెల్లను
సలలితంబుగాను జగతియందు. ౮౭

ఆ॥ వె॥ ద్వేయము దోషమనెడుదౌష్ట్యగుణంబులఁ
బట్టి మనసునందుఁ బెట్టి వేగఁ
జెండివేసి యెడల దండియౌ సౌఖ్యము
తగ లభించు జనుల కగణితముగ. ౮౮

కం॥ ఏరికి కోర్కె నసించునో
వారికిఁ బరమార్థపదవి వశమగు గానీ
ఘోరోరుగసమమగునీ
కోరికకలవారి కద్దికుదుగుపడదుగా. ౮౯

కం॥ నిత్యానిత్యముఁ దెలుసుక
సత్యంబైనట్టి పదవి సరగునఁజొందీ

నిత్యత్వముఁగనువారలు
అత్యంతము సుఖముఁగందురి యవనీస్థలిలో. ౯౦

సీ॥ అజ్ఞానమనియెడి నంధకారముఁబెంప
మదమత్సరంబులు మాత్సరములు
యిలభక్తి శ్రద్ధలఁ బొలియింపఁజేయ శ
రీరాభిమానంబు క్రూరసూరి
సత్వాదిగుణములు సమయింపఁజేయ పా
తకులతోఁడిచెలిమి దగరసుండి
ఘనమనోశక్తిని ఖండించివేయును
యవనిలో విషయేచ్ఛలనులుచూడ;
తే॥ గీ॥ గాన మదమత్సరము లభిమానమును ఖ
లుల చెలిమియును సర్వకోర్కెలనువీడి
నిర్మలంబగు మదిఁగల్గి నిత్యమైన
పదవినొందగ వలయును బాగుమీర. ౯౧

కం॥ నవనీతమునం దేఘృత
మవనినిఁ గాంచంగఁగల్గు నావిధమున నా
త్మవిచారణఁ జేసినయెడ
పరివిమలమగుతనస్వరూపు బాగుగఁదెలియున్. ౯౨

మత్తకోకిల॥ దర్పణంబున దేహమెల్లయు ధాత్రిఁ గన్పడురీతి గా
దర్పనాశనమౌ మనంబున దౌష్ట్యమెల్లయుఁజెండియున్
నేర్పుతో సువిచారణంబను నిద్దమైనటువంటి యా
దర్పణంబున నాత్మరూపము తక్షణంబునఁ దోఁచెడిన్. ౯౩

మత్తకోకిల॥ పంచదారనువీడి చౌటిని భక్షణంబునుఁ జేయన
ట్లుంచితంబగునట్టి నిర్విషయంపుసౌఖ్యము వీడియున్

వంచనంబును గల్గఁజేసెడి పాపమా విషయేచ్ఛతో
సంచరించెడివారి వెట్టిని శక్యమే మహిఁజెప్పగన్. ౯౪

సీ॥ కాళికిబలియివ్వఁగా మేకలనుదెచ్చి
పసుపుకుంకుమతోడ బాగుమీర
శృంగారములఁ జేయ పొంగు తమకు ముందుఁ
జేయబోయెడి పెద్ద చేటెరుగక
నీరీతినే యజ్ఞులిహవిషయంబులు
జుట్టికొన్నకొలది మట్టుమీరఁ
దగ సౌఖ్యమని తాము తలచుకొనుచును విర్రి
వీగుచుందురు చాల వీకతోడ;

ఆ॥ వె॥ తనకు వెంటవచ్చు ఘనదుఃఖ మెరుగక
వెనుక కష్టములను గనెద రకట!
నరసి చూడ ధాత్రి నవివేకమున కన్న
పిచ్చితనముకలదె హెచ్చుగాను. ౯౫

మ॥ కలలోఁ దోచెడిసర్వమున్ నిజముగాఁ గాన్పించు మేల్కొన్నచోఁ
దొలగున్ గంటికిఁ దోచకుండ నిటులే దుర్వారమాభ్రాంతి దా
మలుగంగా నలరారుచున్న జగమేమాయంబుగాఁ బోయెడిన్
తెలియం గావలె దీనిబట్టి భ్రమయే తీరా జగం బంచిలన్. ౯౬

కం॥ ఆకాశమె బ్రహ్మంబని
వీకను వచియించుచుంద్రు వింతగ ధరలోఁ
జోకను కొందరు మనుజులు
ఆకాశంబెట్లు బ్రహ్మమగు గాంచంగన్. ౯౭

ఆ॥ వె॥ సూకరమును దెచ్చి చూపి నందియనిన
భంగి నాకసమును బ్రహ్మమనుచు

పల్కు నట్టివారి వాక్కులనమ్మగాఁ
దగదు యేరికైన జగతియందు.

కం॥ ఎన్నటికిని యాకాశము
పన్నుగ బ్రహ్మంబుగాదు పరికింపఁగనే
చిన్నెలు లేనిదె బ్రహ్మం
బన్నది యెరుగంగవలయు నమలమనీషా. ౯౯

సీ॥ పగలు రాత్రియు రెండు తగనేకమైనఁ బ్రా
పంచంబు నసియించుఁ బాళిమీర
పుట్టసీదలు రెండు నుండనిచో గుడ్డ
మాపమేలేకుండు యాఢిగాను
నీకితినే మది నెంచగారాగంబు
ద్వేషంబు లివి రెండు వీడిపోవ
సౌఖ్యదుఃఖంబులు సత్యంబసత్యంబు
నీవు నే ననునవి నిలువకుండఁ
తే॥ గీ॥ బోయి యేమియులేనట్టి ముక్తి పదవిఁ
గలిగి యానందవార్థిలో ఘనముగాను
నోలలాడంగఁ జేసెడి నొప్పగమదిఁ
గానరాగంబు ద్వేషంబు మానవలయు. ౧౦౦

కం॥ మదిలోఁగల గుణములచే
యొదవును జననంబు మరణమొప్పుగ గుణముల్
విదిలిచి నెడ తనహృదిసే
యదురును లేదమలసుఖము నందిచరించుర్.  ౧౦౧

కం॥ నిశియందున దీపంబును
పొసగింపఁగ వలయుఁ దమము పోవుటకొరకై

మేదునుకుఁ గనక సౌఖ్యము
నే దండిగఁ బొందుచుందు రెపుడునతీతుల్. ౧౧౪

కం॥ పరమనగానదియే మో
మరుగునను న్నట్టిగొప్ప మండలమనుచున్
విరివిగఁ దలచెదరజ్ఞులు
నరయఁగ నాపరము కరతలామలకగతిన్. ౧౧౫

కం॥ విలసిల్లుచుండి దానినిఁ
దెలియంగా లేకపరముతీరుగనెచటో
యలరారుచుండునని మదిఁ
గలవరమునుఁ గాంతురకట జ్ఞానములేమిన్. ౧౧౬

ఆ॥ వె॥ కుజముఁ బుర్వుతొలువఁ గూర్మితోడ వృద్ధిఁ
గనక నంతరించు కరణి భ్రాంతి
యనెడుపుర్వు తొలువఁగనువివేకమనెడు
తరువువృద్ధిఁగాక తగనసించు. ౧౧౭

కం॥ మానము నేకాంతంబును
మానుగ మగ్నత విరక్తి మదిఁగల్గవలెన్
జ్ఞానమునొందుటకై యివి
గానఁగఁగావలసినట్టి ఘనసాధనముల్. ౧౧౮

కం॥ తెల్లనిదగుకుడ్యముపై
నల్లనిదైనట్టి చుక్క నయముగనరయన్
తెల్లముగాగాన్పించును
కుళ్లడగిన మనసునకునుకూరిమినిట్లే. ౧౧౯

కం॥ కన సంశయ మిసుమంత మ
దినిగల్గినవిమలహృదిని తేటగుమసిగో

డనుచుక్క తెలియనట్లుగఁ
గనిపించదు కలుషమదిని ఘనసంశయమున్ ౧౨౦

కం॥ నీరదముచుట్టుకొని నెడ
తీరుగఁ జంద్రుండుచుక్క తీరుగఁదోఁచున్
కూ్రరభ్రమచుట్టుకొనన్
నారయగాఁ దాను దేవుఁ డైననుగానీ. ౧౨౧

కం॥ దేవుండగు తానేమది
జీవుఁడు గాఁదోఁచుచుండు సీతకరుఁడువ
బ్బేవిడిపోయిన యెడలన్
భావింపగ చంద్రుఁడనగ బయలుపడునుగా. ౧౨౨

కం॥ ఈగతినిభ్రమతొలగిన
బాగుగ తా దేవుఁ డనెడిపారున తెలియన్
నాగమువిడుటకుఁజల్లని
దాగాలి యవశ్యమిట్లి యధికభ్రమయున్. ౧౨౩

కం॥ విడిపోవుటకై కావలె
నెడిగాఢవిచారణంబు శీఘ్రమె బ్రాంతిన్
విడఁజేయనీవిచారణ
తడయకఁ గావలసినట్టి తగసాధనగున్. ౧౨౪

తే॥ గీ॥ ముఁగ్గురు జనుల హస్తముల్ మూఁడశద్ధ
మైనసుద్దలు గల్గినవైబొలుచగ
నందులోనొగ జనుడు దాపొందియున్న
శుద్ధమలి నావృతంబను సూటిమదిని. ౧౨౫

కం॥ తెలియం జాలక దానను
కలిగెడు చెడుగాలిచేతఁ గలిగెడుబాధల్

తలయక నొందుచు దుఃఖం
బులలోఁబడి పొర్లుచుండె ముష్కరబుద్ధిన్. ౧౨౬

కం॥ రెండవ మానిసి తనచే
నుండిన యాశుద్ధమలిన యుఁనికిగలదిగా
మెండుగఁదనలో నారయు
చుండియు విడలేకబాధ నొందుచునుండెన్. ౧౨౭

కం॥ మూడవమనుజుఁడు కరమునఁ
గూడిన యాశుద్ధమలిన కూర్తిగలదిగా
రూఢిగఁ దనలో నారసి
వీడియు వేగంబె తాను వేడుకఁగనియెన్. ౧౨౮

సీ॥ ఇట్లి ప్రపంచంబు హేయంబు దుఃఖంబుఁ
గలిగించునదియుంచుఁ గానలేక
అవివేకులైకొంద రైహికంబులఁజిక్కి
ఘనమైన వేదనల్ గాంచుచుండ
రింకకొందరు జనుల్ సంకటంబుల నోసం
గును నైహికంబని గుర్తెరిగి
యును ప్రపంచమునువీడ ఘనదుఃఖముల నెప్డు
జెందుచుందురు తాము పొందుగాను;

తే॥ గీ॥ మరియు కొందరు యిహదుఃఖకరమటంచు
నెరిగి వెంటనె దానిని సరవితోడ
వీడి పరసౌఖ్యమెప్పుడు రూఢిగాను
గాంచియుందురుధాత్రిలో గరిమతోడ. ౧౨౯

కం॥ ధర విషయములం దెప్పుడు
తరుచుగ మెలగుచును మాకుతగులవు యవియున్

విరివిగ కుమ్మరపురుగుల
కరణినియున్నారమందుఁ గపటపు గురువుల్. ౧౩౦

ఆ॥ వె॥ గాని కుమ్మరిక్రిమి క్రమముగానుండుట
యనగ విషయజాల మంటియుంట
గాదు విషయములను గల్పించినను గాని
నంటకుండవలయు నమలమతిని. ౧౩౧

కం॥ విషయంబున యానందము
విషమంబై యుండుగాని వీకను లేదా
విషయంబే దుఃఖము ని
ర్విషయంబున గలదు సుఖము విరివిగనగుటన్. ౧౩౨

ఆ॥ వె॥ వీడవలయు నెపుడు విషయములకుఁ బాటు
వేగిరంబుగాను వేడ్క దాయ
కముగు నిర్విషయసుఖము నొందుటకుఁ బాటుఁ
బడగవలయు నెపుడు బాగుమీర. ౧౩౩

సీ॥ అచలపదవియన సట్టిదిట్టిదటంచుఁ
జూపగాఁ జెప్పగా సూటిగాను
వీలులేదిదిరూపు చాలగానామంబు
క్రియయును లేనిదై గెరలుచుండు
మోదంబు ఖేదంబు వాదంబు భేదంబు
రాగంబు ద్వేషంబు త్రైగుణములు
సత్యంబసత్యంబు జననంబుమరణంబు
లను బంధమునుముక్తి యనెడునఖిల;
తే॥ గీ॥ జాలములులేనిదై యుండుఁ బాళిమీర
దీని నిటువంటిదంచును పూనికలరఁ

చెప్పుటకు వినుటకుఁగూడ యొప్పుగాను
ఁదు యేరికి జగతియందు. ౧౩౪

### భుజంగప్రియాతము.

సుదేహావికారారి సుశ్రీమహాత్మా
సదృత్తమ్ము లేనట్టి చారిత్ర దివ్యా
త్మదాసార్చితా జ్ఞానమందారధీరా
సదానమ్మితిం బ్రోవుసంశీల్యమూర్తీ. ౧౩౫

### సుకాంతి.

గు రో మ హా
త్మ ర మ్య స
చ్చ రి త్ర యో
ప రా త్ప రా . ౧౩౬

### సురలత

గు ణ ర హి తా స
జ్జ న వి ను తా ధీ
వ న ని ధి యా పా
వ న గు రు దే వా . ౧౩౭



# శుద్ధాశుద్ధపత్రిక

| పేజి | పద్యం | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| 1 | ౧ | గురో | గురూ |
| 1 | ౩ | కీర్తిచె | కీర్తుల |
| 2 | ౧౦ | రంగయను | రంగయయను |
| 5 | ౩౧ | శాంతాది | శాంత్యాది |
| 6 | ౩౪ | శక్యమేధరన్ | నాధృవంబుగన్ |
| 6 | ౩౬ | శాంతమా | శాంతమే |
| 7 | ౩౮ | మది | మణి |
| 7 | ౪౧ | లేద | లేదు |
| 8 | ౪౫ | మత్తకోకిల | తరలు |
| 8 | ౪౮ | భూషణిర్వై | భూషణర్వై |
| 9 | ౪౮ | సద్గురువంచు | గుర్వియటంచు |
| 9 | ౫౨ | మానసు | చిత్తము |
| 10 | ౫౮ | ముసు | మును |
| 10 | ౫౮ | మరిత | దురిత |
| 10 | ౫౮ | వరహితుండు | పరహితుండు |
| 11 | ౫౯ | విరాజతంబు | విరాజితంబు |
| 11 | ౬౦ | ముంను:గ | ముందుగ |
| 11 | ౬౨ | డలివి | దవిలి |
| 11 | ౬౫ | సువర్యలేరికా | సుచర్యలేరికే |
| 13 | ౭౧ | గురువు | గుర్వి |
| 14 | ౭౪ | విన్నసున్నైన | విన్నసువైన |

| పేజి | పద్యం | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| 14 | ౮౦ | యనఘుడీ | యనఘుడే |
| 15 | ౮౩ | మాయమహిమలోన | మాయామహిమలోన |
| 16 | ౮౫ | వెలయ | వెలయు |
| 16 | ౮౬ | బిహాలోపల | బిహామందున |
| 20 | ౩ | బాల్యముఁ | భాగ్యముఁ |
| 23 | ౨౬ | హీయఁంబగు | హేయంబగు |
| 25 | ౩౨ | తటికున | తటుకున |
| 26 | ౩౯ | గాని | గాన |
| 26 | ౪౦ | సభూషణము | సుభూషణము |
| 27 | ౪౫ | ఘన | గన |
| 27 | ౪౬ | దృంచుఁ | దృంచఁ |
| 29 | ౫౮ | నలి | నవి |
| 29 | ౬౦ | తోఁ్రవ | తులువ |
| 30 | ౬౫ | ఘనము | మాను |
| 30 | ౬౮ | బరుండగనా | బంరుడంగనా |
| 31 | ౬౮ | మాకీ | మాకే |
| 31 | ౭౧ | వలువిధుల | పలువిధుల |
| 31 | ౭౨ | దొలగిన | తొలగని |
| 33 | ౮౦ | సాచవ్యంబొక | సాచివ్యంబొక |
| 34 | ౮౮ | యెడల | నెడల |
| 35 | ౯౪ | జేయ | జేయు |
| 37 | ౧౦౧ | హృదిసే | హృదినే |
| 38 | ౧౦౬ | నొనర్చి | నొనర్చ |
| 38 | ౧౦౬ | జేయ | జేయుఁ |

| పేజి | పద్యం | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| 38 | ౧౦౯ | సంగ్రిహించి | సంగ్రిహించ |
| 38 | ౧౦౯ | ముకువు | మురుపు |
| 39 | ౧౧౦ | కుజంము | కుజమ్ముౖలు |
| 39 | ౧౧౨ | నుండ | నుండు |
| 40 | ౧౧౪ | దునుకు | దుడుకును |
| 41 | ౧౨౪ | తగ | తగు |
| 41 | ౧౨౫ | మూఁడశద్ధ | మూఁడశుద్ధ |
| 41 | ౧౨౫ | నాఁగ | నాఁక |
| 42 | ౧౨౬ | దుఃఖం | దుఃఖం |
| 42 | ౧౨౭ | పీడ | ఽడక |
| 44 | ౧౩౫ | సుదేహా | సుదేవా |
| 44 | ౧౩౫ | సంశీల్య | సౌశీల్య |
| 44 | ౧౩౬ | గురో | గుహా. |



# ప్రకటన.

సంసార సాగరమునఁబడి, సుఖదుఃఖములనెడి తరంగములచే బాధపడి, స్వప్రయత్నము దరిగానక నల్లాడు సమయంబున, నాకష్టములు మాన్పఁగల మహనీయుల నుపదేశవాక్యములను జ్ఞప్తికి తెచ్చు వారి జీవచరిత్రంబులు భవసాగరమునుండి దరిగాంచుట కాధారమైన నావలు.

గానశక్తి పటములచే బ్రతివారును దమ గృహముల నలంకరించిన కృతార్థులౌట నిశ్చయము. ఈరూప పటములను కొద్ది వెలలకే యందరికి వీలగునటుల తయారుచేసి యుంచితిమి, దీని వలన గలిగెడిలాభ మంతయు మచిలీపురంబున వెలయు శ్రీరంగావధూతలవారి శాంతాశ్రమమునకు సమర్పింపబడును.

| | |
|---|---|
| శ్రీ రామకృష్ణ పరమహంస. ... ... | ... 0-4-0 |
| శ్రీబుద్ధ భగవానులు. ... ... ... | ... 0-4-0 |
| శ్రీరంగావధూత ... ... ... | ... 0-4-0 |
| శ్రీవశిష్ఠ మహాముని. ... ... ... | ... 0-4-0 |
| శ్రీయేసుక్రీస్తు ... ... ... | ... 0-4-0 |
| శ్రీమహమ్మద్ ... ... ... | ... 0-4-0 |
| శ్రీ అని బిసాంట్ ... ... ... | ... 0-4-0 |
| శ్రీ మ్యాడం బ్లావట్స్కీ ... ... ... | ... 0-4-0 |
| శ్రీ జొరాయాస్టర్ ... ... ... | ... 0-4-0 |
| శ్రీ శంకరులు వారు ... ... ... | ... 0-4-0 |
| శ్రీ వివేకానందస్వాములువారు ... ... | ... 0-4-0 |
| శ్రీ భాస్కరానంద స్వాములు వారు ... ... ... ... | ... 0-4-0 |
| "అమ్మూరి లక్ష్మీనరసింహ సోమయాజులు వారు ... | ... 0-4-0 |
| శ్రీ కేశవచంద్ర సేనులువారు ... ... | ... 0-4-0 |
| రాజా రామమోహన రాయలువారు ... ... | ... 0-4-0 |
| శ్రీ సీతారామావధూత ... ... ... | ... 0-4-0 |
| శ్రీ జ్ఞానప్రసూనాంబయోగిని ... ... ... | ... 0-4-0 |

జ్ఞానోదయడైరీ:—ఇది అన్నిసంవత్సరములకు, సుపయుక్తమైనది. మరియు నిందు ప్రతిపుటయందును, నీప్రపంచమున నవతరించిన మహాత్ముల జ్ఞానవాక్యములను సులభమైన తెనుగున అనేకగ్రంథములను పరిశోధించి ప్రచురించబడనైనది. జ్ఞానాపేక్షితులు దీనిం జూచిన మిగుల యానందింతురు. వెల 0-6-0 అణాలు.

విజ్ఞానామృతము:— ఇది శ్రీజ్ఞానమాంబగారిచే రచింపబడిన భక్తిజ్ఞానవైరాగ్యములను బోధించు 105 పద్యములుగల పుస్తకము వెల 0-1-0 అణా.

కుమారసుగుణబోధిని:— ఇదియొక సతీమణిచే ప్రచురింపబడిన బాలురకు హితోపదేశము జేయునీతిపద్యముల పుస్తకము. వెల 0-1-0 అణా

కలయువారు:-

ఆత్మూరి రామమోహనరాయ్,

గుంటూరు.

అని వ్రాసితెప్పించుకొనవలెను.